### పిచ్చికుక్కలు,నక్కలు,తోడేళ్ల కాటులకు మందుధర్మము

పిచ్చికుక్కలు, నక్కలు, తోడేళ్లుకరచిన వారికి పాల్వంచతాలూకా వరంగలుజిల్లాలో చేరిన అశ్వారావుపేట గ్రామములో వుచితము గా మందులు యివ్వబడును. మూడుపూటలు మందు తీసుకున్న చాలును. ఏవిధమయిన పథ్య ములేదు. పిచ్చికుక్కలు కరచినవారికి గాయము మానినతరువాత పిచ్చియెత్తకముందు మందు యివ్వబడును. మందు సేవించినతరువాత యె న్నటికిని పిచ్చియెత్తదు. ప్రాణాపాయముండ దు. యిక్కడికి అనేకులువచ్చి ఔషధములు సే వించివెళ్లుచున్నారు.వి పీద్వారా మందుపంపుట కు వీలుండదు.

అడ్రసు:- ఖమ్మంవరకు రైలుమీదవచ్చి అ క్కడనుంచి బస్సుమీదవచ్చిన ఒ కరోజున రావచ్చును.

ఇట్లు
సెక్రటరీ
శ్రీ వేంకట్రామ నృసింహ్వారాయా (?)
భోషానిలయము,
అశ్వారావుపేట
౨౮-౧-౧౯౩౮

### మొదటిపేజీ తరువాయి

అభిమానింపదగియున్నది- ఇయ్యదిదినదివ్య ప్రవర్తి వందలకొలది ఆయుర్వేద వైద్యులను దేశ మునకెప్పుడు సమర్పించగలుగునో అప్పుడే మనమదృష్ట్యలమగుదుము. ఆయుర్వేదోద్యమచ రిత్రను స్థాలీపులాకన్యాయముగా విమర్శింపగ లిగితిమి. గ్రంథవిస్తరభీతిచే వివరములు వ్రగలివే యువలసివచ్చినందులకు క్షంతవ్యులము

ప్రభుత్వముపక్షమున నిజాంఆయుర్వేద సదమదవాఖానాకు రూ ౧౦౦ లచొప్పునను, ఆయుర్వేదకళాశాలకు రూ ౧౦౦ చొప్పునను మొత్తము నెల ౧కి రూ ౨౦౦ ల గ్రాంటు అం గీకరించినట్లు తెలియుచున్నది.

### నల్లగొం(డ) మాల, మా(దుగలు) మహమ్మదీయ (...)

[విశే(ష) నల్లగొం. డ:

నల్లగొండజిల్లాలో హమ్మదీయమతములో బడుచున్న యత్నము (...) వి. మహమ్మదీయ వ లవద్దనుపెల్లి మహాఘన వుగారు మాల,మాదుల లో కలుపుకొనుటకు (...) యు, మరియు మహవ టవలన పూర్వముక లె

వ్వకల్పనయు, పొరంబోకుభూములు (...) లచేర పట్టాచేయుంచ బడునవియు, మాలమా దుగులకు ప్రత్యేకముగ మికొంచములనుపెట్టించి ధరలు మున్నగువాట్లలో సాహుకార్లనుండి జ రుగుఅన్యాయముల బాధ తప్పించబడునవియు వ్యవసాయపు పశువులనుకొనుటకై అప్పులీయబ డునవియు, ముందుకు నెలజీతములుకూడా ఇ ప్పింతుమనియు, ఇప్పుడుమాత్రము కులస్థులను తురకలలో కలుపుటకు పూనుకొనువారలకు నెల ౧కి రూ ౧లు జీతమొసగబడునవియు ఆశలు పెట్టబడెను. ఈఆశలును, ప్రభువుగారిక ర్మాను భయమును—ఈరెండు సాధనములకు అనేకులు మాల,మాదుగలులొంగి తురకమతము లోచేరుట కంగీకరించిరి. వర్గాన్ని యొక్క ని జమును గాని, పెట్టబడిన ఆశలయథార్థమునుగా ని మాల,మాదుగులు గ్రామాధికారులనుండి వి చారించి కనుగొనలేదు.' గ్రామాధికారులును ఈవిషయములో మాలమాదుగలకు నిజము తె లియబరచినట్లు కనపడదు.

ఎట్లయనేమి, మతపరివర్తన కార్యక్రమము ప్రారంభమయ్యెను. పట్టుతీసి వేసికొన్నందుకు ఒహుమానము. మొలగ్రాదుతీసివేసి లాగులుక ట్టిరి. స్త్రీలు మెడలనుండి పుస్తెలనుతీసి నిమ్మ

(...) బట్టలు (...) ముల పట్టా రాలేదు.

పాములపాడు (?)

నేను ఫాల్గుణ బ౹౹ ౧౧ ఆదివారం (...) బ౹౹ ౧౨ వరకు మిర్యాలగూడెం తా. లోచేరిన మందడివారి తుంగతూర్తి గ్రామము లోనుండి పైనజెప్పినవిషయములను కనుగొని అవిదియనాడు ఉదయము. ఆదే తాలూకాలో చేరిన పాములపాడు గ్రామము చేరేను అక్క డ మాదుగలను పిలిపించగా పెద్దమాదిగవచ్చె ను. అతనిపేరు పాపిగాడని చెప్పెను- అతనిని విచారించగా ఆగ్రామమునకు సయ్యద్ ఉమ ర్ గారువచ్చి అక్కడిమాదుగులను తురక మత ములో చేర్చుటకు చాల ప్రయత్నముచేసినను మాదుగులుఒప్పుకొనలేదనిరి. అప్పుడుఆసదియుం డమాదుగలకును రూ ౪౦౦లు ఇచ్చునట్లును పొరంబోకు భూముల నేర్పాటు చేయునట్లును, ఒకమకొంచము ప్రత్యేకముగవారల కేర్పా టుచేయునట్లును, (...) ఒక (...) చేయునట్లును ఎప్రచారకుడు

(...) ఖులు నీరందరు (...) గురించి నిజముశోధించు నెను. మాల,మాదుగల కష్టములనుపరిశీలించి ప్రభు గారికి విన్నవించుకొనగా, ఫర్మాను పంప (...) నియు, దానిఅమలుకై బాబెహుకూమతు ని ర్మానపైవరర్వాత ప్రభువుగారుతిరిగి (...) మర్ (...) ౧౩౩౭లో. నాడు ఫర్మానుద్వారా బాబెహుకుమతువారు నిర్ణయించిన నియమము ల నంగీకరించిరనియు, ఈనియమములు మాల్గు జారీమోకనును మహకమానుండి ౩నిహార్ (...) ఇవ్వండాదు ౧౩౩౯లు. గవర్నమెంటు సర్కా రి అధికారులకు తెలియ(జే)య (...)నవనియు, ఈగ స్తు దక్కన్ లో (...) యొక్క ౧౩ జట్టు ముందు "(...)" అనుభాగము లోని ౫ నుండి ౨౬వరకు గల పుటలలో ప్రక

...ంచుచున్నాము. ప్రథమ జిల్లాసంఘము ఏర్పడినతర్వాత జరిగిన జిల్లాసంఘ వార్షికోత్సవములలో మొదటి దగు గౌరవము ఈ సమావేశమునకు లభించినది. ఈసమావేశమందు సభ్యులచే అంగీకరింపబడిన తీర్మానములు జిల్లావాసుల అవసరములను వెల్లడిచేయుచున్నవి. అచ్చంపేట, ఆత్మకూరు, గోపాలపేటలలో మాధ్యమిక పాఠశాలలు అవసరమనియు, ౧౦౦౦ కంటె ఎక్కువ జనసంఖ్యగల గ్రామములలో ప్రాథమిక పాఠశాలలైనను పెట్టించవలననియు, ప్రతి తాలూకాస్థలమందును పెద్ద పెద్ద గ్రామములందును బాలికలకై దేశభాషలలో బోధించు పాఠశాలలను స్థాపించవలయుననియు మొదటి నాలుగు తీర్మానములు ప్రభుత్వమువారిని, సంస్థానముల అధిపతులను కోరుచున్నవి. ఈ కోరికలు క్రొత్తవికావు, పలుమారులు గ్రామజనులచే ఈపత్రికయందు వెల్లడించబడినట్టివే. ప్రతి తాలూకా కేంద్రస్థానమందును, పెద్దపెద్ద గ్రామములలోను గ్రంథాలయ పఠనాలయములును, ప్రతిగ్రామములో రాత్రిపాఠశాలలును స్థాపింపదగునని కోరబడినారు. ప్రతితాలూకాలోను, పెద్దపెద్దగ్రామలలోను, ఆయుర్వేద వైద్యులకు అలవెన్సులనిచ్చి గ్రామస్థులకు వైద్యసౌకర్యముల నేర్పరచవలెననియు, అథమము ప్రతిపెద్ద గ్రామములోను సుశిక్షితులైన మంత్రసానులను ఏర్పాటు గావించవలెననియు, పశుచికిత్సాలయములను ప్రతితాలూకాలోనేగాక ప్రతి గ్రామమందును ఏర్పాటుచేయవలెననియు, మహబూబు నగరమునుంచి అమరాబాదుకు నడచు సర్కారి మోటారుబస్సులలో తగినంత చోటులేక ప్రయాణికులకు శ్రమకలుగుచున్నదనియు, మహానూరపర్వడిన ప్రదేశములలో గ్రామస్థులకు ప్రతిదినము కలుగు ఇబ్బందులను అటవీశాఖవారు తొలగించవలెననియు—ఏకోరికలు కోరబడినవో అవి విద్యావిషయమున కోరబడిన కోరికలవలెనే వెంటనే ప్రభుత్వమువారి శ్రద్ధకు రాదగినవి.

వార్షికోత్సవసందర్భమున కొందరుత్సాహులగు ఆంధ్రయువకులు వరవిక్రయమను నాటకమును ప్రయోగింపదలచుకొనిరి. ఈనాటకప్రయోగమునకు ఎందు అందలి విషయము లేవి విచారించి కనుగొని తాలూకాదారుగారు తుదకు అందేమియు ఆక్షేపణీయములు లేవని అనుజ్ఞనిచ్చి యుండినట్లు తెలియుచున్నారు. కాని నాటకము ఆడబోవునప్పటికి, తహశీల్దారుగారు నాటకమును ఆడరాదని నిషేధించిరి. వరవిక్రయనాటకములో ఆంధ్రులలో అనేక కుటుంబముల ఆర్థికస్థితిని పాడుచేసినట్టి దుర్భరములైన వరకట్నదురాచారమువలని నష్టములు ప్రదర్శింపబడినవి; అంతేగాని, నాటకమందు ప్రజలు శాంతికి భంగము కలిగించు ఆక్షేపణీయవిషయములు లేనియు ఏవిషయములున్నవని తెలిసిన చో ... జిల్లాయొక్క శాంతిక్రమములకు బాధ్యులగు తాలూకాదారుగారు అంతదూరము విచారణచేసియు ఆనాటకము నాడుటకనుజ్ఞయొసంగి యుందురా? అంతదూరమాలోచించి తాలూకాదారుగారొసంగిన అనుమతిని కొట్టివేయుటకు క్రిందిఅధికారిగారికిఅవసరమేమికలిగెనో అధికారమెట్లున్నదో మాకు తెలియజాలకున్నది. ఈ కారణములచే తహశీల్దారుగారు నాటకమును ఆడకుండ ఆపి వేయుటకు ఆజ్ఞాపించిరనుమాట నేమేము నమ్మజాలకున్నాము.

కాని నాటకమును గూర్చి తెలిసిన వార్తలో ఇంతమాత్రము సత్యముగ నున్నది. మొదట నాటకమాడ దలపెట్టుటయు, కానితర్వాత ఎవరివలననో దానికి న్యాయముగనో అన్యాయముగనో ఆక్షేపణవచ్చుటచే నాటకకార్యక్రమమంతయు మానుకొనబడుటయు జరిగినవిషయములు. ఈ ఆక్షేపణకునాగరకర్నూలులో ఆసమయమున నుండిన జనులలో ఎవరేని బాధ్యులాయనివిచారించ, ఎవరును తమకు తెలియనట్లు చెప్పుచు నాటకము ఆపబడినందుకు అందరును తమకే విచారమైనట్లు గూడ చెప్పినటుల తెలియుచున్నది జనులలో ఎవరును బాధ్యులు గానిచో మరెవరు బాధ్యులు? ఒకవేళ అక్రమముగ జనులలో నెవరేని ఆక్షేపణచేసిబెదరించినను, అట్టి అక్రమములచే న్యాయమైన హక్కులకు అభ్యంతరము గలుగకుండ అధికారులనుండి సంరక్షణ పొందుట నాటకము నాడదలచినవారి ధర్మము, సంరక్షణనొసంగుట అధికారుల ధర్మము. అసలు మొదట నాటకమాడుటకు అనుమతియే ఒసగబడలేదా యనునదియు అనుమానించవలసి వచ్చుచున్నది. అనుమతి నిరాకరించబడినచో దానికికారణములు తెలుపబడుటముఖ్యము. సలనన, నాగర కర్నూలులో మాత్రమే, ఆనాడుమాత్రమే ఈనాటక ప్రయోగమువలని శాంతికి రానిదా, అసలు వరవిక్రయ నాటకమనునదియే శాంతికి భంగముకలిగించు ప్రమాదకరమైన, నిషేధించదగిన నాటకమా— అనువిషయములు ఇప్పటికైనను ఈసంబంధమున అధికారముగలవారలనుండి నమ్మకముగా తెలిసియున్నచో, ఇకమీదటనాటకము ఈనాడదలచినపుడు ముందుగాఖర్చుభరించి అన్నిఏర్పాట్లును చేసికొనితర్వాతనాటకము నాడకుండమానుకొనవలసిన దురదృష్టము చాలచోట్ల తప్పగలదు.

ఎట్లైనను మొత్తముమీద సభ జరిపించుటకు తోడ్పడినందుకు తాలూకాదారు, తహశీల్దారు, పోలీసుసర్కిల్ ఇన్స్పెక్టరుగార్లను ప్రశంసించక తప్పదు.



# నేటి సామ్యవాదము బౌద్ధయుగము నాటి సామ్యవాదము

బుద్ధజయంతిలో ప్రసంగము

గత, (౨౧-౫-౩౭) తేదిన థియొసాఫికల్ సొసైటిలో బౌద్ధ ధర్మాభిమానుల పక్షమున రాజాబహద్దర్ రాయెుధిశ్వేశర్ నాథ్ గారి అధ్యక్షతమున ౨౫౮౧ వ జయంత్యుత్సవము జరుపబడెను. సొసైటి ఆవరణమంతయు చక్కని పతాకములతో నలంకరించబడియుండెను. ప్రజలు క్రిక్కిరిసియుండిరి. నవాబ్ అబ్దుల్ ఖయ్యూం సాహెబుగారు, చిత్రించిన (బుద్ధదేవుని (ఆయిల్ పెంటింగ్) చిత్రపటము ప్రదర్శింపబడియుండెను. శివరత్నమండలివారి భజనలతో సభాకార్యము ప్రారంభించబడెను.

"శివశ్రేష్ఠి" భాగ్యరెడ్డిగారు హైదరాబాదులో జరుపబడిన ౨౫ సం॥ల జయంత్యుత్సవముల సంక్షిప్తరిపోర్టును, మరియు అధ్యక్ష మహాశయుల దివ్యనామములు చదివి వినిపించుచు ఈ ౨౫ వ జయంతి "రజతోత్సవమునకు" విశ్వమునకధిపతి, పరమాత్మనినామాంకితమైనవిశ్వేశ్వర్ నాథ్ గారు అధ్యక్షతవహించి సభాకార్యజయప్రదమొనర్ప ప్రార్థింప బడుచున్నారని ప్రస్తావించినదానికి శ్రీ రామకిషన్ ధూత్ గారామోదించిరి. అధ్యక్షులవారు ఆసీనులైనానంతరము, పండిత అడిపూడి సోమనాథరావుగారు ఆంధ్రభాషలోను గౌతమబుద్ధుని జీవనచరిత్రమును వెల్లడించిరి. ఇంగ్లీషులో శ్రీ.డి-వి- శ్రీ ఖండె బి.ఏ.ఎల్.ఎల్.బి. గారు ఉరుదులో శ్రీ వడింపల్లి జానకిరామయ్య పంతులుగారు. ఇంగ్లీషులో కన్యాశారదాబాయి బి.ఎస్సి. గారుపన్యసించినందున అధ్యక్షులవారితో పుష్పమాల సన్మానము బడసిరి,

అంతిమున అధ్యక్షులవారి వ్యాఖ్యానానంతరము సంఘమాన్య భాగ్యరెడ్డిగారు ప్రసిడెంటుగారికి ఉపన్యాసకులకు దివ్యజ్ఞానసమాజము వారికి కృతజ్ఞతను వెల్లడించుచు:—

"బౌద్ధధర్మము యేనాడు ఈపుణ్యమాతృభూమినుండి అసమించెనో ఆనాటినుండియేతిరుగ వైశాలికవర్ణ వ్యవస్థపద్ధతి మొలకెత్తి అసంఖ్య అస్పృశ్యుల జనసంఖ్యను వృద్ధిచేసెను. హింస సమేరలేదు. క్రూరము తాండవమాడెను, ఐక్యమత్యతనూన్యమై పరదేశీయుల దండనకు పాత్రులై బానిసలై క్రుందుచున్నారు.

నేడు నలువైపులనుండి "సామ్యవాద" ధ్వనులు వినవచ్చుచున్నవి. బుద్ధుని కాల సామ్యవాదము కేవలము మనుష్యజాతికేగాక, ప్రాణిమాత్రులకైయుండెను. సర్వజీవులసమానత్వమును ప్రకటించి అమలు జరుప బడు చుండెను.

గాని ఆధునిక సామ్యవాదము ఇంకను బాల్యావస్థయందున్నదని చెప్పక తప్పదు. పరదేశములకుపారద్రోలిన బుద్ధధర్మము అచ్చటిఆటవిక తిరుగు పవిత్రతంతులనుగాజేసి రాక్షసకృత్యముల అస్పృశ్యతను రూపుమాపి లోక కళ్యాణమునకు తోడ్పడి పవిత్రత్వము ప్రకటించుకొనునట్టి భాగ్యము మబ్బు కేసినది.

వర్ణవ్యవస్థ సంకెళ్లతో బంధింపబడి కులభేదములతో కుళ్ళుచున్న హిందూదేశము, [మతము కెవ్వరైనను,] ఏకజాతీయతను ప్రకటించి అదర్శప్రాయమైన సర్వజీవులసమత్వమునకుపాటుపడదో అప్పటివరకు భుక్తిలేదు, ముక్తిలేదు అనినుడువుచు మహాశయులకందరికి, బాదాంమిశ్రీపుష్పములతో సన్మానించి సభ ముగించిరి.

"ఒక బౌద్ధధర్మాభిమాని"

# బాలికలఉన్నతపాఠశాల, సుల్తానుబజారు

మహిళావిశ్వవిద్యాలయపు(బొంబాయి) ౧౯౩౭ సం॥ పరీక్షల ఫలితములు

సుల్తానుబజారు బాలికల ఉన్నతపాఠశాల కార్యదర్శిగారిట్లు వ్రాయుచున్నారు.

"జి. ఏ, పరీక్షకు హాజరైన ౧౧ మంది విద్యార్థినులలో ౫ మంది గెలుపొందిరి. అందులో మూడవక్లాసులో గెలుపొందిన శ్రీమతి సౌ-ార్య-రూపా మాబాయి గారు. శ్రీమతినందగిరి ఇందిరాదేవిగారును హైదరాబాదు కేంద్రమునకు చెందినవారు.

యఫ్. వై.ఏ. (Frist yaer in Arts)పరీక్షకుహాజరైన ౧౭ మందిలో ౬ మంది గెలుపొందిరి. అందులో మూడవక్లాసులో గెలుపొందిన శ్రీమతి ఆవమాలసావిత్రీదేవిగారు హైదరాబాదు కేంద్రమునకుచెందినవారు.

# ప్రజాప్రభుత్వపు రోజులలో ప్రాచీన రాజవైభవములు అనుచితములు

## చక్రవర్తి గారి ఆడంబరముల ఖర్చు తగ్గించవలెను

### పార్లమెంటు సభలో సూచన

లండను మే ౨౭—

నేటిదినము కామన్సుసభలో సివిలులిస్టు బిల్లుపైజరిగిన చర్చసందర్భమున కార్మిక నాయకుడగు గ్రీనువుడుగారు బిల్లును నిరాకరించవలయునని సవరణ నుపపాదించుచు ఇట్లు చెప్పిరి:—

"ప్రజా ప్రభుత్వసంప్రదాయముల ననుసరించి రాజుగారిజీవితము నిరాడంబరముగ నుండుట ఉచితము. ఈసిద్ధాంతమును పాటింపక తరతరములనుండి వచ్చుచున్న సంప్రదాయములననుసరించి రాజవైభవములను ఉంచుటకు సభవారు ఆమోదింపజాలరు. రాజవైభవములకై గొప్పమొత్తములను ప్రత్యేకించు ఈసివిలులిస్టుబిల్లును సభవారు నిరాకరింప వలయునని కోరుచున్నాము-రాజపదవిని అంతమొందించి రిపబ్లికుప్రభుత్వము నేర్పరుపవలయునని కార్మికపక్షమువారి ఉద్దేశముకాదు- రాజవైభవము మితిమీరియుండకూడదనియు, రాజలాంఛనములు నిరాడంబరముగ నుండవలయుననియే మాఉద్దేశ్యము-

ఈసవరణపై జరిగినచర్చకు ప్రత్యుత్తరమిచ్చుచు నెవిలీచేంబర్లినుగారిట్లుచెప్పెను:-

రాజుగారిజీవితము నిరాడంబరముగువిధముననుండవలయుననియు, రాజవైభవములను తగ్గింపవలయుననియు ఈదేశమునందుగాని, డొమినియనులయందుగాని ఇంతవరకునెవ్వరునుప్రభుత్వమువారిని కోరియుండలేదు-కాని రాజలాంఛనములు నిరాడంబరమగు విధమున నుండవలయుననియు, ఒకతరగతివారికి మరియొకతరగతివారికినిగల హెచ్చుతగ్గులు సాధ్యమైనంతవరకు నశించిపోవలయుననియు ప్రపంచమున బలవంతముగ ప్రజాభిప్రాయము ఏర్పడుచున్నదను విషయము నాకుతెలియును. రాజునకుసంబంధించిన విషయములందేగాక ఆగర్భశ్రీమంతుల విషయములోకూడ ఈసూత్రము వర్తించును- ప్రస్తుతము ఇంగ్లాండురాజులు పూర్వపురాజులవలెగాక సామాన్యజనులలో కలసిమెలసి వ్యవహరించుచుండుటను మనము చూచుచున్నాము-కావున ఈవిషయములను రాజుగారి నిర్ణయమునకు వదలివేయుట ఉచితమనియు, మనమే త్వరపడుట సరియగుపద్ధతి కాదనియు సూచించుచున్నాను.

గ్రీనువుడుగారి సవరణపై సమ్మతులుపుచ్చుకొనబడెను-అనుకూలముగ ౧౧౭మంది, ప్రతికూలముగ ౨౮౦మంది సమ్మతులనొసగిరి. సివిలు లిస్టుబిల్లు ఆమోదింపబడెను.

---

# బెంగాలు నాగపూరు రైల్వే కార్మిక సంఘముపై ఏజంటు నిరాదరణ న్యాయమే

## మర్డీగారి నివేదికతీర్పు: కార్మికాభిమానుల ఆగ్రహము

సిమ్లా మే ౨౮:—

బెంగాలు-నాగపూరు రైల్వే ఇండియనుతేబరు యూనియను రైల్వేఅధికారులచే సక్రమముగ గుర్తింపబడలేదుగాను-ఏజంటుగారుయూనియనుగుర్తింప నిరాకరించుట న్యాయముగనే యున్నది- సమ్మెకట్టినవారిని హింసించినట్లు తగినసాక్ష్యము అగపడలేదు. అని సమ్మెకట్టు రాజీషరతులు అమలుజరుగుటనుగూర్చి విచారింప నియమింపబడినమర్డీగారు తమ నివేదికలో దెలిపిరి. ఈనివేదికను ప్రభుత్వమువారు అంగీకరించిరి. ఈనివేదిక దేశీయులందరిచే చాల తీవ్రముగా నిరసించబడు మన్నది.

---

## కార్మిక నాయకులపై నిషేధపు టుత్తరువులు

కలకత్తా మే ౨౮,

హుగ్లిజిల్లాలోని ఒక్కసేరయాలోనికి వెళ్లకూడదను నిషేధపుటుత్తరువును జనపనార మిల్లుపనివాండ్ర సమ్మెసందర్భమున జిల్లా మేజిస్ట్రేటు కార్మికనాయకుడగు అంజామన్ ఎం. ఎల్. సీ. గారికి జారీచేసిరి. ఈఉత్తరువునుప్రస్తుతము తొలగించిరి.

౨౪పరగణాలజిల్లాలలోనూరు- యట బహిరంగసభలుజరుపుటకు వీలులేదని ౧౪౪ సెక్షను ఉత్తరువును సబుడివిజనల్ ఆఫీసరు ప్రకటించిరి.

ఆప్రాంతమున బహిరంగసభలలో ఉపన్యసింపనున్న యస్. దత్తుమజుందారు ఎం.ఎల్.ఏ. బంకిము ముఖర్జీ యం. యల్. ఏ. గార్లను యిరువురు కార్మికనాయకులకు బహిరంగసభలలో ఉపన్యసింపకూడదను౧౪౪ సెక్షను ఉత్తరువు జారీచేసిరి.

---

## చైనా- బ్రిటిషు సరిహద్దు వివాదము

సిమ్లా, మే ౨౮.

బ్రిటిషు సరిహద్దుకమిషను రెండు దేశములనుమధ్య సరిహద్దును నిర్ధారణచేయుటకై ఏర్పడినది కృషిని సమాప్తమొందించినది. యీ కమిటీనిర్ధారణలమీద రెండు ప్రభుత్వములును సరిహద్దు విషయములో రాజీ కుదుర్చుకొనవలెను- అవసరమైనచో నాన్కింగులో దీనికై ఒకసభ కావలసిన ఏర్పాటుచేసికొనవచ్చును.

పిదప యీకమిషనుఏర్పాట్లను రాయబారములను అన్నిటిని చేర్చి ఒక క్రొత్త ఒడంబడిక చేసికొనవచ్చును. ఇట్లొక క్రొత్తపత్రమును వ్రాసికొనినంతవరకును సరిహద్దుసమస్య పరిష్కారమైనదని ప్రకటింపకూడదు.

కడపటికి, సరిహద్దునిర్ణయము జరిగి పోయినది. దానిని చిత్రపటములో గీచి యున్నారు- దీనివిషయమై అనుమానము లున్నచో రాయబారములు జరుపుకొనవచ్చును.

---

# ఆర్యసమాజీయ మహమ్మదీయ సంఘర్షణ

## అభియోగముతీర్పు

ఉస్మానాబాదు: తేది ౨౬:-

మగతసంవత్సరము లాతూరు తాలూకాగ్రామందు మహమ్మదీయులకు, ఆర్యసమాజికులకుజరిగిన సంఘర్షణలో కొందరు మహమ్మదీయులను నిర్బంధించి లాతూరున్యాయస్థానమునకు ఒప్పగించగా అందు ఒక్కొక్కరికి ఆరునెలలశిక్ష విధించిరి- కాని నేరస్థులు పైన్యాయస్థానములో అప్పీలు చేసిరి- అందువీరిని విడుదలచేయబడినట్లు తెలియుచున్నది-

---

## ఒకమనిషి ౫౦ సం॥ జీవితంలో ౯౫,౦౪౦,౦౦౦ అంగలు నడుస్తాడు

విద్యావంతుడు కావడానికి రు.౧౫౪౦౦, క్షవరాలకు క్రాపింగులకు రు.౬౦౦ ఖర్చు

రామచంద్రదర్శిగారు

లోకములో కొద్దిమందికి మాత్రము తమ జీవితకాలమువరకు ఖర్చులు తెలియును. ౫౦ ఏండ్లపరాసరి జీవితమునకు ఖర్చువివరములను క్రింద తెలుపుచున్నాను.

౧ గర్భప్రవేశము మొదలు జననకాలమువరకు రు. ౧౦౦. విద్యావంతుడు కావడానికి రు ౧౫౫౦౦. క్రాపింగులకు, క్షవరాలకు రు ౬౦౦. సబ్బులకు రు ౨౨౫, తలనూనెలకు పౌడరులకు రు ౯౦౦, ధోవతులకు [యిండియా నులుధరించునవి] రు ౨౫౦, కోట్లకురు ౫౦౦: షర్టులకురు ౨౫౦, పైజామాలకు (కోటుకు షర్టు కుబదులుగాధరించునవి) రు ౨౫౦, బనియనులకు (అండర్ వేర్లు) కేబురుమాళ్లకు రు ౨౦౦, చెప్పులకురు ౨౨౫, చాకలికిరు ౬౦౦, భోజనమునకురు ౬౦౦౦, అద్దెలకురు ౩౯౦౦, లైట్లకు రు ౪౫౦. ట్రాము, బస్సు వగయిరాలకు రు ౯౨౨౫: చిల్లరఖర్చులురు ౩౦౦, ఇవన్నీకలిసి మొత్తం రు. ౨౨౯౪౫. టీ ఖర్చు రు౨౯౯-౯-౬-౦ [త్రాగేవాళ్లకుమాత్రము.] సిగరెట్లకు [త్రాగేవాళ్లకు]రు ౫౪౫౦ స్వదేశి (ఇండియాలోచేసే అసిగరెట్లు) రు ౯౦౦. ౭. తాంబూలములకు (వేసికొనేవాళ్లకు)రు ౫౯-౨-౬-౦.

పండ్లుతినేవారికి పండ్లదినుసులకగుఖర్చు రు ౪౦౦౦- ఒకమనిషి ౯౦౦౦౦- సౌన్లు మంచినీళ్ళుత్రాగును- అత్రాగేనీళ్ళబరువుర్రు౯౬౦౦౦సౌనులుంటుంది- ఒకమనిషి౭౨౦౦౦సౌన్లు తింటాడు- అతినేపదార్థాలబరువు ౨౬౬౦౦౦ సౌనులుఉంటుంది- ఒకవ్యక్తి ౨౦౦౦౦సౌన్లసబ్బు వంచేస్తాడు. స్నానం చేయు నీళ్ల బరువు ౧, ౯౦,౦౦౦ సౌనులు- ఒకమనిషి ౯౫,౦౪౦,౦౦౦ అంగిలునడుస్తాడు- ఈ మొత్తము ౩౯౦౦౦ మైళ్ళదూరముంటుంది-ఒకమనిషి ౧,౫౫౫,౨౦౦,౦౦౦ సౌన్లు ఊపిరిపీలుస్తాడు- ఈలోపలపీల్చేగాలిబరువు ౯౦,౪౫౦,౦౦౦ సౌనులుంటుంది- మామూలుగా ఒకమనిషి ౧,౪౪౨,౦౦౦ సౌన్లురెప్పవాలుస్తాడు- ఈరెప్పపాట్ల కాలాన్ని లెక్క చేస్తే ౪౦.౦౦౦ గంటలవుతుంది- అంటే ౧౯౯౯ రోజుల ౧౯ గంటలుఅగును- చిన్నతనమున పొడిగిచ్చునట్లు శరీరము ౧౯౯ అంగుళములవరకు పెరుగునని సాధారణముగా తెలియుటలేదు- శరీరముబరువు ౩౩౦ పౌసులవరకు పెరుగును- గోళ్లు ౧౦ అడుగులవరకు పెరుగును- తలవెంట్రుకలు ౫౦అడుగులపొడుగువరకు పెరుగును- గడ్డంమీదివెంట్రుకలు ౧౦ అడుగులనిడుపుండును- పాదాలు ౨౯ అంగుళములనిడుపుండును- ౨౪ అడుగులనిడివిగల చెప్పులను తయారు చేయవలయును- ఒకమనిషి తన దినకృత్యముల నెరవేర్చుటకు కుతూహలముగనుండును- స్నానంచేయుటకు ౯౦౦౦ గంటలు, క్షవరానికి ౧౨౦౦ గంటలు, నిద్రపోవుటకు ౧౫౩,౦౦౦ గంటలు, దీనికి దానికి ౧౭౨౫౦ గంటలు అయిపోతుంది- మొత్తము ఈ గంటలన్నీ కలిపితే ౧౮౭,౪౫౦ గంటలవుతుంది-

మనిషికుండే ౫౦ సంవత్సరాల జీవితకాలములోను అతనువాడుకోవలసినది ౪౩౮,౦౦౦ గంటలుమాత్రమే ఈ ౪౩౮౦౦౦ గంటలకాలంలో పై ౧౮౭,౪౫౦గంటలుకాలంతీసివేస్తే ౨౫౦,౫౫౦ గంటలుమిగులుతవి- అయితే తన వ్యవహారాలకును, తనదేశానికి, తనమతానికి, తనకుటుంబానికి, తనమిత్రులకి తనసొంత యోగక్షేమములకు వినియోగించవలసినవి- ఈ ౨౫౦,౫౫౦ గంటలేనా? ఈవిషయమై ఎప్పుడైనను ఆలోచించినామా?

[జనవాణి]

## కరాచీ—మదరాసు

### వాయుటపాల వ్యాప్తి

### హైదరాబాదుకు వైర్లెస్

బొంబాయి మే ౨౬—

ఇకమీద కరాచీ-మదరాసు టపాసర్వీసును ప్రతిమార్గములోను వారమునకు ౫ సార్లు నడుపునట్లు చేయుదురు- కరాచీ- మదరాసు మార్గమును ఒకదినములోపూర్తి చేయవచ్చును- ఈమార్గమును కొలంబోవరకు సాగించుదురు- ఇండియా ప్రభుత్వమువకును, తాతాకంపెనీవారికిని కరాచీ-మదరాసు సర్వీసును అభివృద్ధి చేయువిషయమై జరుగుచున్న ముఖ్యసంభాషణలు పూర్తియైనవి- సిలోను ప్రభుత్వమువారు కూడ విమానపుమార్గమును మదరాసునుండి సిలోనుకు సాగించుటకుఒప్పుకొనిరి-

ఈవిమానములు కరాచీ, భుజ్, అహమ్మదాబాదు, బొంబాయి, హైదరాబాదు, మదరాసు, తిరుచునాపల్లి, కొలంబో, పూనా, షోలాపూర్ లలో నిలచును- కరాచీలో ప్రభుత్వము వైర్లెస్ స్టేషనుయున్నది- అహమదాబాదు బొంబాయిలలో ఏర్ క్రాఫ్టు వైర్లెస్ స్టేషనులను స్థాపించుటకు ప్రయత్నించు చున్నారు- హైదరాబాదు కట్టిసంస్థానాలుకూడ హైదరాబాదు భుజ్ లలో వైర్లెస్ స్టేషనులనునిర్మించవచ్చును-

## గోలకొండ కవులసంచిక

| | | |
|---|---|---|
| చందాదారులకు | వెల రు | ౧-౦-౦ |
| ఇతరులకు | ,, ,, | ౨-౦-౦ |

## భారతీయ బాలికల యూరపుయాత్ర

లాహోరు, మే ౨౫

వివిధభారతీయవిద్యాసంస్థలకుచెందిన ౨౦ మంది భారతీయబాలికలు, విద్యాసంబంధమైన పర్యటనము చేయుటకు యూరపు ఖండమునకు పోవుచున్నారు-

ఈపర్యటనము అంతర్జాతీయ విద్యార్థినీకులయొక్క—ఆదరణమున ఏర్పాటు చేయబడినది- లాహోరులోని ఫోరుమన్ క్రిస్టియన్ కళాశాలప్రిన్సిపాలు గారిభార్య దత్తాశతిగారి నాయకత్వమున నిది నిర్వహింపబడును- దత్తాసతి యింతవరకు ఏర్పాటుచేసియుండిన ఇటువంటిపర్యటనములలో ఇదివాల్గవది- ఈసారియాత్రలో ఫ్రాన్సు, బెల్జియం, ఇంగ్లాండు, నార్వే, స్వీడన్, జర్మని, స్విట్జర్లాండు దేశములకు వెళ్లుదురు. తిరుగుప్రయాణము మార్సెలేసులో ఆగస్టు ౧౩ వతేదీని ప్రారంభము కావచ్చును. పైసులో జూలైమాసమందుజరుగు అంతర్జాతీయ విద్యార్థిసభకు హాజరయ్యెదరు-

### పెషావరు దేవాలయతగవు

లాహోరు మే ౨౫—

లాహోరులో పంజాబుసనాతన ధర్మసభా కార్యదర్శియగు గోస్వామి గణేశదత్తుగారికి, మసూరినుండి పండిత మదనమోహన మాలవ్యాగారు "పెషావరునకువెళ్లి రఘునాథదేవాలయము విషయమై హిందూనాయకులతో తంప్రదించి ఎట్లయిన రాజీపరచవలెను" అని వంతిపంపిరి-

The best medium for reaching 7 million Andhras of the State Advertise in Golconda Patrika

# గోలకొండపత్రిక

# GOLKONDA PATRIKA

HYDERABAD-DECCAN

The First Telugu Bi-Weekly in Andhra Desa and the leading Telugu Newspaper of H.E.H. The Nizam's Dominions.

వర్తకులకు
నిజాంరాష్ట్రీయ తెలంగాణ జిల్లాలలోని ఆంధ్రులలో మీ వర్తకవృద్ధికి సాధనము! గోలకొండ పత్రికలో ప్రకటనము

Vol. 12. | Thursdy 3—6—1937 | No. 8

## మన నేటిచక్రవర్తిదంపతుల పూర్వవంశ వైరచరిత్ర

చక్రవర్తి పూర్వవంశీయురాలొకతె చక్రవర్తి వంశీయునిచే చిత్రహత్య చేయించబడుట

ఇప్పుడు మనచక్రవర్తినియగు యెలిజబెత్ మహారాణి స్కాట్లండులో చాల పురాతనము గొప్పవంశమునకు చెందిన యొకవిషాదకరు- ఈవంశచరిత్ర శతాబ్దములకొలది వ్యాపించియున్నది. ఆమె సుప్రసిద్ధమైన బౌస్ లియనుయొక్క వంశమునకు జెందినది- ఇప్పుడుజరిగిన ఆమె పట్టాభిషేకమహోత్సవము సరిగా నాలుగుసంవత్సరముల క్రింద చరిత్రలో ఒక అసామాన్య విషాదము జరిగినరోజు నాడే తటస్థించుట విచిత్రసంఘటనము.

౧౭ జూలై ౧౫౩౭ నాడు చక్రవర్తినికి నేరుగా సంబంధించిన పూర్వపుబంధువురాలు లేడీ గ్లామిస్ అను నామె ఎడింబరో కోటబురుజులయెదుట గొప్ప గుంపుచూచుచుండగా కాల్చివేయబడెను.

తొయిబడిసంబరు నెలలో చక్రవర్తి సింహాసనమెక్కుటకు ఒకటి రెండు వారముల పూర్వము, అప్పట్లో యార్కుప్రభ్వి గానుండిన ఇప్పటిచక్రవర్తినికి యెడింబరో వచ్చెను. అప్పుడు ప్రవోస్టుప్రభువు ఉపన్యసించుచు లేడీ గ్లామిస్ యొక్క దురదృష్టమును పేర్కొనెను. వెంటనే చక్రవర్తిని ఆలోచన ఏచటికో పారిపోయినట్లు అందరును ఆమె ముఖవిలాసమునుచూచి గుర్తించిరి.

లేడీ గ్లామిస్ కాలములో నుండిన వారలచే వ్రాయబడినచరిత్రమునుబట్టిచూడ ఆమె చాల అందమైనది.

చిన్నప్పుడు పెండ్లికాకముందు ఆమెపేరు జేనెట్ డగ్లస్. ఆమె అరవ అంగూసుప్రభువు యొక్క చెల్లెలు. ఆమె ౬వ లార్డుగ్లామిస్ అను జానును పెండ్లాడెను. అతడు ఇరువురుపుత్రికలను పుట్టించి ౧౫౨౮ లో చనిపోయెను.

మరణానంతరము దుఃఖకాలమైన తర్వాత అవితంతువును తిరిగిపొందుటకై బ్రిటనుదేశపు నాలుగుమూలలనుండియు వరులు ఆమెవెంబడించిరి. ఆమె తుదకు సర్వాంశములకుజెందిన మనోహరుడైన హైలెండువాసియగు ఆర్చిబాల్డ్ కాంబెల్ ను వరించెను.

ఆమెయిట్లు మరొకరినివరించుటచే ఆమెను అధికముగా మెచ్చుకొనుచుండిన, విల్లియం లియన్ అను, ఆమె మొదటిభర్త దాయాదికొకనికి ఆగ్రహముకలిగెను. ఆమెరెండవ పరిణయము సమాచారమువినగానే, అతడుఎట్లైనను ఆమెకు తగినశాస్తి చేయుటకు ప్రతినబట్టెను. అతనికి ఆమె ౫వ జేమ్సుతాను బ్రతికియున్నంతకాలము ఎవరిని స్కాట్లండుభూమిపై అడుగుపెట్టనివారనిగ ప్రకటించెనో అట్టి డగ్లస్ కుటుంబమునకు చెందినదనుసంగతి జ్ఞాపకముండెను.

చిన్నతనము లోవంటియు జేమ్సు అంగూస్ ప్రభువునకు చిక్కిన ఖైదీగానుండెను. ౧౬ ఏండ్లవయస్సురాగానే, అతడు తప్పించుకొని, ఆఅంగూస్ ప్రభువును ఓడించి, అతనినికుటుంబముతోను, మిత్రులతోను రాజ్యమునుండి గెంటివేసెను. కాని అతనిమనస్సులో రాజుకొనుచున్న ద్వేషమింకను చల్లారలేదు.

“నేను ఎన్నటికిని, రోమునగరములోనున్న పోపు ఆజ్ఞాపించినప్పటికిని డగ్లస్ వంశీయునితు ఉంచను” అని జేమ్సు ఒకప్పుడు రాజసభలో శపథము చేసెను.

లేడీగ్లామిస్ పై ఇదివరకే రాజుయొక్క క్రోధము ప్రసరించియుండెను. ఆమెభర్తమరణానంతరము ఆమెఆస్తి ఆక్రాంతమైనట్లు ప్రకటించబడెను. భర్తకు విషముపెట్టి చంపెననికూడ ఆమెపై నేరము మోపబడెను.

తర్వాత ఆనేరము తొలగించబడెను గాని, విలియం లియన్ రాజుకు లేడీగ్లామిస్ అతనికి విషముపెట్టి చంపుటకై దేశభ్రష్టత నొందింపబడినతనసోదరుని పక్షమున ప్రయత్నించుచున్నదని చెప్పినపుడు రాజు యొక్క పూర్వపు ద్వేషాగ్నియు, డగ్లసు వంశీయుల భయమును మరల సంపూర్ణముగ రగుల్కొనెను.

ఏమాత్రము ముందువెనుక లాలోచింపక, రాజు లేడీగ్లామిస్ ను, ఆమెభర్తను, ఆమెకొడుకులను, ఆమెవంటమనిషియగు జాన్ లియును గిరఫ్తారుచేయుటకు ఆజ్ఞనొసగు పత్రముపై సంతకము చేసెను.

వారలు అప్పకొరకు స్కాట్లండులోని హైలెండులలో కాంబెల్ యొక్క ఇంటిలో నుండగా పట్టుకొనబడి, తప్పించుకొని పోకుండ మంచి రక్షకభటుల బందోబస్తుతో యెడింబరోకు తేబడి ఒకచీకటిగదిలో త్రోయబడిరి. లేడీగ్లామిస్ పై మొదట మోపబడిన నేరము, “రాజును విషముపెట్టి చంప యత్నించుట” యనునది చాలినంత గొప్పదిగ లేదని, “మరియు మంత్రప్రయోగము” అను మాటలను కూడ చేర్చిరి.

నిందితురాలియెడ ప్రజల సానుభూతిలేకుండ చేయుటకు ఇదియొక యెత్తు. స్కాట్లండు దేశపు ప్రజలకు మహాఅనుమానము, మాంత్రికులయెడ వారలకు చంపివేయవలెనన్నంత కోపముండెడిది. ఎంతఘోరములైన బాధలు పెట్టినను లేడీగ్లామిస్ తనపై మోపబడిన నేరమును అంగీకరించకపోవుటచే, ఆమె పనివాండ్రకందరికిని, అధికారులు వారలను చెప్పవలసినదిగకోరిన దానినంతయు వారు ఒప్పుకొని చెప్పునను, చిత్రవధచేయు ఆకాలపు ఒకసాధనముతో సాగదీసి చిత్రహింసపజేసిరి. లేడీగ్లామిసును క్రొత్తగాఏర్పరచిన విచారణసంఘముందరి న్యాయాధిపతుల సమక్షమునకు దెచ్చిరి. చిత్రహింసచే ఆమె ఎంతబలహీనముతోను, నొప్పితోను బాధపడుచుండినను, ఆమె తననిర్దోషత్వమును సమర్థించుకొనుటకు చేసిన ఉపన్యాసము చాలపటువుగ నుండెను.

“నేనిచట, రాజును విషముపెట్టి చంపదలచినను నేరము మోపబడియున్నాను. విషము! నేనెన్నడుగాని విషమేచూడలేదు నేనెక్కడ దానినికొంటినో, నాకుదానినెవరు తెచ్చియిచ్చిరో వారలను చెప్పనిండు, చూతము, ఒకవేళ నావద్ద నేయున్నను, నేనెట్లు ఉపయోగించగలను? నేనెన్నడును రాజుగారి సొంతబల్లవద్దకు గాని, వంటకుగాని పోయియుండలేదు.” అని ఆమె చెప్పెను.

“న్యాయాధిపతులారా నిర్దోషికి ఎట్టిగాయముగాని కాకుండ కాపాడుట మీకర్తవ్యము, కాని, నాశత్రువులపగయు, శక్తియు, నేను దోషినైనను నిర్దోషినైనను శిక్షవిధించక మీకు తప్పించుకొన వీలులేనంత తీక్షణమైనవో నాహృదయము ఆకళంకమని పరీక్షించి రూఢిచేసినవిమ్మట. సంతోషముతో మరణించెదను. నాకీర్తికి భంగము కలిగించుటకంటె. నాప్రతిష్ఠకు నిజమైనకళంకమును దేనినిగాని పెద్దదబ్బలును, దండిగా చమురుపట్టించబడిన కట్టెలును సిద్ధముగ నుంచబడియుండెను.

ఆమెఅందమును, వాక్పటిమయు న్యాయాధిపతుల ధైర్యమును వారామె దోషియని నిర్ధారణ చేసినతర్వాతగూడ, వదలించినవి. వారలు స్వయముగా రాజుగారిని కలసిమాట్లాడి నేరమును క్షమించగోరుటకు నిశ్చయించుకొనిరి. కాని రాజుకు డగ్లస్ వంశీయులపైనుండు ద్వేషము అసాధ్యము కదా!

మరణదండనవమలుపరచుటకు ఏర్పాట్లు చురుకుగా చేయబడుచుండెను. ఇదిప్పుడు యస్ప్లనేడు అనబడు పూర్వపు కాజిల్ హిల్ పైజక్కగ నవలసియుండెను. ప్రాణముతో ఆమెను కాల్చివేయుటకు, కట్టివేయుటకు నాటబడిన స్తంభముచుట్టును తారుపూసిన పెద్ద దబ్బాలును, దండిగా చమురుపట్టించబడిన కట్టెలును సిద్ధముగనుంచబడెను-

ఆదుర్గమునకు సంబంధించిన సైనికదళమును ఆపట్టణముయొక్క రక్షకభటులును ఇరువురును పిలిపించబడిరి. పెద్దజనులగుంపొకటి అచట మహోద్రేకముతో చేరియుండెను. ఆమె శిక్షనుండి వారచేత తప్పించబడవచ్చునని భయముగనుండెను-

తెల్లవారుచున్నను, ఎంతమాత్రమువిచారపడనిమనస్సుతో, లేడీగ్లామిస్ ఒరుసైనసంరక్షకులతో దుర్గద్వారమువెలుపలికి తేబడెను. ఆమెను గొలుసులతో దహనస్తంభమునకు కట్టివేసినతర్వాత, ఆమెచుట్టును తారుతోను దబ్బాలను, నూనెలోముంచిన కట్టెలను పేర్చి, నిప్పంటించిరి. కొలదికాలములో మంటలు ఆమెచుట్టును మంటలు పైకెగయుచుండెను.

గుంపులోనిజనులు నిశ్శబ్దముగ హాహాకారములు చేయసాగిరి. ఈ ఘోరదృశ్యమునంతయు గ్లామిస్ భర్తయు, కుమారులును దుర్గ గోడముయొక్క ఒక కిటికీలోనుండి చూచుచు నిద్వేగించిన దుఃఖభాజనులైరి. ఈ క్రౌర్యము మొరటు ఆనాగరికులను గూడ ఆమర్షించుట కవసరమైనది.

లేడీగ్లామిసు శాంతమును, ధైర్యమును, గాంభీర్యము నవలంబించి బూడిదయయ్యెను. ఈ శాంతధైర్యగాంభీర్యములను చూచిన జనులు భయవిస్మయమోహితులైరి.

ప్రియురాలి భయానక మార్యను గాంచి ఆర్చిబాల్డుకాంబెల్ కు వెర్రియెత్తెను; మరుసటి సాయంకాలమతడు ఆదుర్గముయొక్క ఏటవాలైన ప్రాకారముపైనుండి క్రిందికి దూకుటకు యత్నించెను.

అతడు ఉపయోగించుచుండిన తాడు తెగెను. అతనిశరీరము ముక్కలుముక్కలై మరునాడు ఆపర్వతపాదముకద్ద పార్ లాక్ సమీపమునందుండగా జూచిరి.

ఈదుర్మార్గకము అయిదవజేమ్సు పేరుకు శాశ్వతకళంకముగ నుండగలదు-కాని కాలము మాత్రము పగతీర్చుకొనకుండునా! కాలచక్రము తిరుగుచునేయుండును, కనుక నేడున్నట్టి రాజుయొక్క వంశీయుడగు చక్రవర్తికి రెండువందలయేండ్లక్రింద అతనిపూర్వవంశీయుడు అంతక్రూరముగ సజీవముగ కాల్చియుంచిన స్త్రీ సంతతి పరంపరలోవచ్చిన యీమె రాణిగా నుండుట చిత్రము కాదా!

---

## పింగిలి జనార్ధనరెడ్డి స్మారకనిధి

### విద్యార్థి వేతనములు

పైవిద్యార్థివేతనములకొరకు దక్షిణ హైదరాబాదు రెడ్డివిద్యార్థులు క్రిందిచిరునామాకు తమ దరఖాస్తులను జూలై నెల 15వ తేది 1937 లోగా చేరునట్లు పంపుకొనవలయును- కనీసము మెట్రిక్కుపరీక్షలో కృతార్థులైనవారు టెక్నికల్ గాని, ఇంజనీయరింగు, వైద్యముగాని చదువదలచుకొనినవారు మాత్రమే దరఖాస్తులు పంపుకొనవలయును. ఇదివరలో విద్యార్థివేతనములు పొందినట్టి పాతవిద్యార్థులుకూడ తమపరీక్షాఫలితములను తెలుపుకొనుచు దరఖాస్తులు పంపుకొనవలయును- నూతనవిద్యార్థులు తమ, తమ దరఖాస్తులవెంట దిగువవ్రాసిన సనదులుకూడ పంపుకొనవలయును-

1 ముల్కీ-సనదు,
2 మెడికల్ సనదు,
3 నడవడి ,,
4 బీదవాడని ఋజువుచేయు సనదు
5 పైయేసంవత్సరము పైయేపరీక్షలో కృతార్థుడైనదియును తెలుపు-పత్రము;

మిగిలిన వివరములను కార్యదర్శిని విచారించి తెలియవలెను-

పి. వి. నరసింహారెడ్డి,
కార్యదర్శి
ఇంటినంబరు 3180 [illegible]
[illegible], హైదరాబాదు.

Printed and Published by G, Ramakrishna Reddy at the Golkonda PowerPress; Hyderabad. Editor K. Balakrishna Reddy